నెహ్రూ బాల పుస్తకాలయం

# బాపు

## (రెండవ భాగం)

మూల రచన, చిత్రాలు
ఎఫ్. సి. ఫ్రేటాస్

అనువాదం
బి. రజనీకాంత రావు



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా



ISBN 81-237-0408-9

ప్రథమ ముద్రణ 1970 (శక 1892)
తృతీయ ముద్రణ 1993 (శక 1914)


Bapu Part-II *(Telugu)*

**రూ. 6.00**

డైరక్టరు, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్ పార్క్,
కొత్త ఢిల్లీ-110016 చే ప్రచురించబడినది.



గాంధీజీ ఉప్పుసత్యాగ్రహం జరిపించినందుకు ఆయన్ని బ్రిటిషు ప్రభుత్వం అరెస్టుచేసింది. ఆ చర్యకు అసమ్మతిగా ఇండియా అంతటా హర్తాళ్లు జరిగాయి. కొన్ని పట్టణాలలో హింసాత్మకచర్యలు జరిగినా, పౌరసహాయనిరాకరణోద్యమం మొత్తంమీద శాంతంగానే సాగిపోయింది.

బొంబాయిలో రెండు ప్రభుత్వాలు సాగుతున్నాయా అనిపించింది. యూరపియనులూ, బ్రిటిషువారిపట్ల అణకువగా ఉండే భారతీయసైనికులూ ఒకతోవనూ, మిగిలినవారంతా కాంగ్రెసు మార్గమునూ అనుసరించారు. ప్రతివారమూ హర్తాళ్లు జరిగేవి.

కబురందిన క్షణంలో నగరంలోని దుకాణాలన్నీ మూసివేసేవారు; వీధులన్నీ వేలకొలదీ స్త్రీ పురుషులతో కిటకిటలాడేవి. అంతా నిశ్శబ్దంగా సాగేది. ఏ ఉద్యమానికైనా కాంగ్రెస్ సమ్మతి పొందడం అవసరం. తెల్లని దుస్తులు ధరించి, దేశభక్తిగీతాలు పాడుతూ ఊరేగింపు చేసేవారు. అందరూ చేతితో వడికిన ఖద్దరే ధరించేవారు.

భారతీయులు బ్రిటిషువారి పరిపాలనను ఇకపైని ఎంతమాత్రమూ ఒప్పుకోరని స్పష్టమైంది.

ఈ సమస్య తేల్చడానికి వైస్‌రాయ్ ఇర్విన్ ప్రభువు గాంధీజీతో సంప్రతించగోరారు. గాంధీజీని, కాంగ్రెసు కార్యవర్గసభ్యులను వారు తమలో తాము పూర్తిగా చర్చించుకొనేటందుకు వీలుగా ఏషరతులూ లేకుండానే చెరసాలనుంచి విడుదల చేస్తున్నట్లు జనవరి 25 వ తేదీని వైస్‌రాయ్ ప్రకటించాడు. 1931 జనవరి 26 వ తేదీని గాంధీజీని, మిగిలిన నాయకులను విడుదలచేశారు. ఉద్యమాన్ని అణచివేసేచర్యలు ఇంకా కొన్నిచోట్ల ప్రభుత్వంవారు కొనసాగిస్తూండగానే, వైస్‌రాయ్‌తో ముఖాముఖీ సంప్రతించాలని గాంధీజీ సూచించాడు.



ఫిబ్రవరి 6 వ తేదీని అలహాబాదులో ఒక సమావేశం జరిపి కాంగ్రెస్ నాయకులందరూ ఒక రాజీతీర్మానం తయారుచేశారు. తమపక్షానికి ప్రతినిధిగా గాంధీజీ ఈ రాజీకోసం రాయబారాలు జరపడానికి అధికారం ఇచ్చారు.

ఇందుకు కొందరు ఒప్పుకోలేదు. " 'మిడిల్ టెంపిల్ లాయరు'గా పట్టా పుచ్చుకొన్న రాజద్రోహి మిస్టర్ గాంధి తూర్పుదేశాలలో తరచుగా కనబడే ఫకీరులా నటిస్తూ, ఒక పక్కని ప్రభుత్వాన్ని ఎదిరించి పౌరసహాయనిరాకరణం సాగిస్తూనే, సగం దిసమొలవేషంతో వైస్‌రాయ్ భవనపు మెట్లవరుస యెక్కడంగాని, బ్రిటిషుచక్రవర్తి ప్రతినిధితో సమానహోదాలో సంప్రతించడంగాని చూస్తే, చాలా భయానకంగాను, వికారంగాను ఉంటుంది" అని చర్చిల్ అన్నాడు.

ఫిబ్రవరి 17 న మొదలుపెట్టిన ఈ సంప్రతింపుల ఫలితంగా, చివరికి ఒక ఒప్పందం కుదిరింది. 'గాంధి-ఇర్విన్ ఒడంబడిక' అనే పేరుతో ఈ ఒప్పందం పైని సంతకాలు ఢిల్లీలో 1931 మార్చి 5 వ తేదీని జరిగాయి. సంభాషణలు స్నేహపూర్వకంగాను, సాదరంగాను జరిగాయి. అయితే, అధికారవర్గాల వ్యతిరేకతవల్ల, తీవ్రమైన అభిప్రాయభేదాలు చెలరేగాయి. మితవాద నాయకు

లయిన శాస్త్రి, సప్రూ, జయకర్‌లు మధ్యవర్తిత్వంచేసి, రెండుపక్షాలవారినీ మొండిపట్టు పట్టవద్దనీ, ఒకరినొకరు అర్థంచేసుకోడానికి ప్రయత్నించమనీ కోరారు. అందుచేత గాంధీజీ పౌరసహాయనిరాకరణోద్యమం ఆపుచెయ్యడానికి నిశ్చయించాడు.

ఒడంబడిక ననుసరించి—(1) ఉద్యమం ఆపుచేయాలి; (2) పరిపాలనా బాధ్యత, సర్దుబాటులూ, రక్షణలతో, వివిధరాజ్యాల కూటమిగా భారతదేశపు రాజ్యాంగాన్ని రూపొందించేటందుకు జరపబోయే రౌండ్ టేబిల్ సభ చర్చలలో అన్నింటిలోను కాంగ్రెసువారు పాల్గొనాలి; (3) దేశంలో ఆయా చోట్ల జరిగిన పోలీసు హింసాచర్యలను గురించి విచారణకోసం పట్టుపట్టకూడదు.

ఉద్యమంలో అరెస్టు అయిన రాజకీయ ఖైదీలందరను ఒకేసారి విడుదల చెయ్యడానికీ, జప్తుచేసిన ఆస్తి, భూములు సొంతదారులకు అప్పచెప్పడానికీ, అత్యవసరపరిస్థితిలో జారీ అయిన (ఆర్డినెన్సు) చట్టాలను రద్దుచెయ్యడానికీ, పన్నులేకుండా ప్రజలను ఉప్పు తయారుచెయ్యనియ్యడానికీ, మద్యమూ, నల్లమందు, విదేశీబట్టలూ అమ్మేచోట్ల శాంతంగా పికెటింగు చెయ్యనియ్యడానికీ వైస్‌రాయ్ తన సమ్మతిని ప్రకటించాడు.

1931 ఆగస్టు 27 వ తేదీని గాంధీజీ; పండిత మాలవ్యా, శ్రీమతి సరోజినినాయుడు రౌండ్ టేబిల్ సభలో పాల్గొనడానికి లండన్‌కు ఓడలో బయలుదేరారు. భారతదేశపు భవిష్యత్తు గురించి తగిన పథకం తయారు చెయ్యాలని ఆ సభ ఆశయం. భారతదేశపు సంస్థానాధిపతుల ప్రతినిధులు, ముస్లిములు, సిక్కులూ, క్రైస్తవులు, పార్శీలు ఇంకా ఇతర వర్గాలు ఆ సభలో సమావేశం అయారు.



గాంధీజీతో వెళ్లిన వారిలో ఆయన కార్యదర్శులు మహదేవదేశాయి, ప్యారేలాలు,



ఆయన కుమారుడు దేవదాసు, శిష్యురాలు మీరాబెన్ ముఖ్యులు. ఆయన స్నేహితులూ, శ్రేయోభిలాషులూ ఆయనను అభినందన సందేశాలతో ముంచివేశారు. తన అలవాటు ప్రకారం ఆయన ఓడలో నూలువడకడం, పుస్తకాలు చదవడం, ఉత్తరాలు వ్రాయడం మానలేదు. ఓడ పైభాగంమీద నడకలుకూడా సాగించేవాడు. ఆయనకు అన్నిటికంటే ఇష్టం పిల్లలు కనుక, యూరపియన్ బాల బాలికలతో స్నేహం కలిపాడు. ఓడ ఆగే ప్రతి రేవులోను అక్కడి ప్రజలు ఆయనకు స్వాగతంచెప్పి, శుభాకాంక్షలు తెలిపేవారు.



కొన్నివారాల శ్రమతప్ప సాధించిన ఫలితమేమీ లేకపోయింది. గాంధీజీ బానిసతనాన్ని పూర్ణస్వరాజ్యంగా మార్చివేదామనుకొన్నాడు. సభలో వచ్చిన సలహాలేవీ గాంధీజీకి నచ్చలేదు.

ఆయన టూకీగా ఇలా అడిగాడు—

''నాయింటికి నేనే యజమానిని అంటూ, ఇనపపెట్టె తాళంచెవి మీచేతిలో ఉంచుకొని, గుమ్మంముందు మీ కాపలావాణ్ని ఉంచడం-ఇదేం న్యాయం?''

ఆ సభలో చేసిన తీర్మానం ప్రకారం శాసనసభల ఎన్నికల విషయంలో ప్రత్యేక మతవర్గాలకు, భూస్వాములకు, వాణిజ్య వర్గాలకు, ఇంకా ఇతరులకు ప్రత్యేక నియోజకవర్గాలను కేటాయించారు. సభ్యులను ఆ యా జాతులకు, వర్గాలకు చెందినవారే ఎన్నుకొంటారు.



ఇది గాంధీజీకి ఆశాభంగం కలిగించింది. అటువంటి వర్గ విభాగాలలోనుంచి ఎటువంటి జాతీయప్రభుత్వమైనా ఏర్పాటుకావడం అసాధ్యం! కాని, ఈ ప్రయాణంలో రౌండ్ టేబిల్ సభకు వెలుపలనే గాంధీజీ పనులు ఎక్కువగా నెరవేరాయి. ఆయన తాను దరిద్రుల ప్రతినిధిననీ, దరిద్రనారాయణుడననీ ప్రకటించుకొని, లండన్‌లో పేదప్రజలు నివసించే ఈస్ట్ ఎండ్ అనే పేటలో కింగ్స్లే హాల్‌లో బసచేశాడు. అక్కడ ఆయన మిస్ మ్యూరియల్ లెస్టర్ అనే ఆవిడకు అతిథిగా ఉన్నాడు. రౌండ్ టేబిల్ సభ జరిగే సెంట్ జేమ్సు పేలెస్ అక్కడికి బహుదూరమైనప్పటికీ, తనకు కొంత అసౌకర్యం అయినప్పటికీ లండనులోని పేదప్రజలతోనే బసచేశాడు గాంధీజీ.



ఆయన లాంకషైర్‌లో గడిపిన శని ఆదివారాలు ఆయనకు ఎన్నడు మరపురాని సంతుష్టిని కలిగించాయి. ఇండియాలో విదేశీబట్టలను బహిష్కరణ చేస్తూండడంచేత లాంకషైర్‌లోని మిల్లులలో పనిచేసే చాలామందికి ఉద్యోగాలు పోయాయి. గాంధీజీ వారికి తనదేశీయుల పేదతనంగురించీ బాధలనుగురించీ బాగా నచ్చేటట్లు చెప్పాడు. వారికి మన సమస్యలు బోధపడి, వారు గాంధీజీ అభిప్రాయాలతో ఏకీభవించారు.

గాంధీజీ ఎన్నో సమాజాలలో ఉపన్యసించాడు; ఎందరితోనో పరిచయ సంభాషణలు (ఇంటర్‌వ్యూలు) చేశాడు. ఆయన బ్రిటిషురాజును, లాయిడ్ జార్జి, చార్లీ చాప్లిన్, బెర్నార్డ్ షా, సర్ శామ్యూల్ హోర్ మున్నగు వారిని కలుసుకున్నాడు.

ఆయన ఇంగ్లండ్‌లో ఉన్నప్పటికీ, తన పాత అలవాటుప్రకారం ప్రాతః కాలపు షికార్లు మానలేదు. అక్కడ చలి ఎంత ఎక్కువగా ఉన్నా ఆయన ఒక కండువా మాత్రమే కప్పుకొని, సాక్సు లేకుండా చెప్పులజోడు తొడుక్కొని, కోటులేకుండానే షికారు వెళ్లేవాడు. విమర్శకులు ఆయన్ని తరచుగా 'సగం దిసమొలపకీరు' అని పిలిచేవారు. అయినా, అటువంటి పకీరే ఇంగ్లండ్ రాజదంపతులకు గౌరవింపదగిన అతిథి అయాడు.

అక్కడి బాలబాలికలతో భేటీ ఆయనకు ఎక్కువగా ఆనందాన్ని కలిగించింది. ఆయన సాధుశీలమూ, దయాగుణమూ వారికెంతో నచ్చి, వారు ఆయన్ని ప్రేమించారు. ఆయన పుట్టినరోజునాడు వారంతా ఇండియాలోని పేదపిల్లల కోసం ఎన్నో అందమైన కానుకలనుతెచ్చి గాంధీజీ కిచ్చారు. ఇంగ్లండ్‌లో ఆయన సేకరించిన వస్తువు లన్నింటిలోకీ, ఈ కానుకలు అమూల్యమైనవి అని గాంధీజీ భావించాడు.

ఆయన లండన్ విడిచి బయలుదేరినపుడు ఆయన తనతో తీసుకొని వెళ్లిన వస్తువులు ఆ బొమ్మల కానుకలు మాత్రమే.

అక్కడి ప్రజలందరికీ కృతజ్ఞతతో వందనాలు అర్పించాడు. "ఈ ఆతిథ్యం, ఈ ఆదరమూ, నేను ఎన్నటికీ మరిచిపోను; మా దురదృష్టదేశపుగతి ఏమైనాసరే" అన్నాడాయన.

స్వదేశానికి తిరుగుప్రయాణంలో గాంధీజీ, దారిలో ఆగి, జెనీవా సరస్సు వద్ద విల్లాలో బసచేసిన ప్రసిద్ధ ఫ్రెంచి నవలారచయితా, భారతదేశపు అభిమాన మిత్రుడూ, తన పాతస్నేహితుడు అయిన రోమారోలాను కలుసుకొన్నాడు. మన సంస్కృతిపైనా, సాహిత్యంపైనా, వేదాంతంపైనా, రామకృష్ణపరమహంసా, వివేకానందా వంటి యోగులపైనా రోమారోలాకు హృదయపూర్వకమైన గౌరవం ఉండేది. ఇద్దరు మిత్రులూ ఇండియా స్వాతంత్ర్యాన్ని గురించీ, ఇంకా ఎన్నో విషయాలను గురించీ మాటాడుకున్నారు.



గాంధీజీ అక్కడ ఎంతో సంతృప్తిగా కాలంగడిపారు. రోమారోలా రచించిన గాంధీజీ జీవితచరిత్రము చాలా ప్రసిద్ధికెక్కిన గ్రంథము.



తిరుగుప్రయాణంలో గాంధీజీ రోమ్ నగరంలోని ప్రసిద్ధమైన సిస్టైన్ ఛాపెల్ ప్రార్థనామందిరాన్ని దర్శించారు.

1931 డిసెంబర్ 28 వ తేదీని ఆయన బొంబాయిరేవులో దిగారు. ఆనాటి సాయంత్రం ఆజాద్ మైదానంలో జరిగిన మహాసభలో ఉపన్యసించారు. లండన్ సభలో జరిగిన చర్చల వివరాలను తెలియజేసి, తాను వెళ్లినపని



ఎందుకు సఫలంకాలేదో చెప్పాడు. "ప్రభుత్వంతో సహకరించడానికి వీలయే మార్గం కనుక్కోవచ్చు ననుకొన్నాను. ఇప్పుడయినా అటువంటి మార్గాంతరానికై నా సాయశక్తులా ప్రయత్నిస్తాను" అన్నాడాయన.

అయితే, వైస్రాయ్ లార్డ్ విల్లింగ్డన్ దృష్టి వేరేమార్గంలో సాగింది. అత్యవసరచట్టాలు(ఆర్డినెన్సు)జారీ అయాయి; వేలకొద్దీ జనం అరెస్టుఅయారు.

సహాయనిరాకరణం తిరిగి మొదలుపెట్టుదని కాంగ్రెసువారు ప్రజలకు ఆదేశం ఇచ్చారు. 1932 జనవరి 4 వ తేదీని గాంధీజీని బొంబాయిలో అరెస్టు చేశారు. ఆనాడు ఆయన మౌనం పాటించేరోజు కనుక, ఆయన తన సహచరులకూ, ఇంగ్లండ్‌లోని మిత్రులకూ కొన్ని సందేశాలు వ్రాసి ఇచ్చాడు.

ఉద్యమంలో చురుకుతనం హెచ్చినకొద్దీ, ప్రభుత్వం దమననీతిని అవలంబించి హింసాకాండకు పాల్పడింది. కాంగ్రెసును, దానికి సంబంధించిన ఇతర సంస్థలను దేశద్రోహాలుగా ప్రకటించి వాటి ఆస్తులను జప్తుచేయించింది.

ప్రభుత్వం కాంగ్రెసువారిని అరెస్టుచేసి, వారి ఆస్తులను, ఇళ్లను, ముద్రణాలయాలను స్వాధీనం చేసుకొంది.

"సిపాయివిప్లవంనాటినుంచీ బ్రిటిషుప్రభుత్వం ఇండియాలో అమలు జరిపిన శిక్షాకాండలో ఇంత తీవ్రమయిన చర్య ఇదే" అని విన్స్టన్ చర్చిలే గొప్ప చెప్పుకొన్నాడు. ఇంత జరిగినా సహాయనిరాకరణం మాత్రం ఆగకుండా సాగుతూనే వచ్చింది. గుజరాత్‌లోను, సంయుక్తపరగణా (యు. పి.) లోను పన్నులు చెల్లించడం మానివేశారు; అటవీపాలన సూత్రాలను, ఉప్పు



గుత్తదారీపద్ధతినీ కూడా ఎదుర్కొన్నారు: విదేశీవస్త్రాల బహిష్కరణ కొనసాగించారు.

ప్రభుత్వం అనుమతిలేకుండా ఏర్పాటు అయిన సభలను, ఊరేగింపులను లాఠీ ప్రయోగంచేసి చెదరగొట్టారు. తిరుగుబాటు జరిగిన ప్రాంతాలలో పెద్ద మొత్తాలలో ఉమ్మడి జరిమానాలు విధించారు. ఒక్క జనవరి నెలలోనే 15,000 మంది అరెస్టు అయారు. ఏడాది పూర్తి అయేసరికి 67,000 మందికి చెరసాల ప్రాప్తించింది.

అప్పటికప్పుడే జవాహర్‌లాల్ నెహ్రూ చెరసాలలో చేరాడు. ఆవెనుక కస్తూర్బా వెళ్లింది.

ఇదివరకులాగే, గాంధీజీ తన చెరసాల జీవితాన్ని మంచి ప్రయోజనానికై వినియోగించుకొన్నాడు. పాకీవాళ్లు, తోలుపని వాళ్లు మొదలైన అంటరానివారుగా హిందూసోదరుల అనాదరానికీ వెలికీ పాలయిన జాతులను ఉద్ధరించే సమస్యపట్ల శ్రద్ధ వహించాడు.





గాంధీజీ వారందరికీ 'దేవుని మనుష్యులు' అని అర్థంవచ్చే 'హరిజను'లనే పేరుపెట్టాడు. ఆతరవాత అదే సంవత్సరం ఆయన ప్రారంభించిన కొత్త వారపత్రికకు కూడా 'హరిజన్' అనే పేరుపెట్టాడు. ''సంఘంలో ఎక్కువగా చిన్నచూపు పొందిన జనులే దేవునికి ప్రేమపాత్రులు'' అని చెప్పాడాయన.

వారు పార్లమెంటుకు తమ ప్రతినిధులను తామే వేరుగా ఎన్నుకొనేటట్లు ప్రత్యేక నియోజకవర్గాలిచ్చి ప్రభుత్వం హరిజనులను హిందూ సంఘంనుంచి చీలదియ్యాలని చేసిన నిర్ణయం ఆయన మనస్సును చాలా నొప్పించింది. ఇందువల్ల వారికి సంఘంనుంచి వేరుపాటేగాని, సంఘంలో కలిసిమెలిసి ఒకటయిపోవడం సాధ్యంకాదు గదా.



ఈ విషయమై నిర్ణయం తీసుకో వద్దని కోరుతూ గాంధీజీ సర్ శామ్యూల్ హోర్‌కు ఒకజాబు వ్రాశాడు. కాని దీనిని పెడచెవినిపెట్టి, ప్రభుత్వం తమ నిర్ణయాన్ని ప్రకటించింది. 1932 సెప్టెంబర్ 20 వ తేదీని గాంధీజీ అందుకు నిరసనగా ప్రాణం పోయేవరకు ఉపవాసం చేస్తానని దీక్షపట్టాడు. అప్పుడు ఆయనకు తోడుగా ఉండడానికై కస్తూర్బాను యెరవాడజైలుకు మార్చారు.



మూడోరోజు ఆయన పరిస్థితి విషమించింది. హరిజన నాయకుడయిన డాక్టర్ అంబేద్కర్‌తో సహా వేరువేరు జాతుల నాయకులంతా సమావేశమై ఒక ఒప్పందానికి వచ్చారు. గాంధీజీ దానికి సమ్మతించడంతో ప్రసిద్ధమయిన పూనా ఒడంబడిక జరిగింది. ప్రభుత్వం అందులోని షరతులకు ఒప్పుకోవడంతో గాంధీజీ ఉపవాసదీక్ష విరమించాడు. అప్పుడు జరిగిన ఒక మహాసభ తీర్మానం ప్రకారం "ఇకపైని హిందువులలో ఎవ్వరికీ పుట్టుక కారణంగా అంటరానివారుగా పరిగణించడానికి వీలులేదు."

రౌండ్‌టేబిల్ సభలో పాల్గొనడానికి ఇంగ్లండ్ వెళ్లినపుడు గాంధీజీ హిందూమత ఏకత్వాన్ని సమర్థించడానికి శక్తికొద్దీ ప్రయత్నించాడు: ఇప్పుడదే ఆదర్శానికై తన ప్రాణాలను ఒడ్డడానికి సిద్ధపడ్డాడు. "అంటరానివారిని వేరేజాతిగా కేటాయించడానికి మేము ఒప్పుకోము. సిక్కులు కావలిసివస్తే వేరేజాతిగా శాశ్వతంగా ఉండనీండి. అలాగే ముస్లిములూ, యూరపియనులూను. అంటరానివారు శాశ్వతంగా అంటరానివారుగానే ఉండిపోతారా? అంటరానితనం అలాగే ఉండిపోవడంకంటె హిందూమతం నశించడమే మేలు అని భావిస్తాను" అని అన్నాడు గాంధీజీ.



అయితే మార్గం అంత సులభంకాదు. హరిజనులకు అన్నిటిలోను సమానత్వం ఉండాలని గాంధీజీ ప్రచారం ప్రారంభించాడు కాని, తన సహచరులలోనే అందుకు వ్యతిరేకించిన వారున్నారని తెలుసుకొన్నాడు.

తాను కొత్తగా ప్రారంభించిన వారపత్రిక హరిజన్‌లో ఆయన తీవ్రంగా వ్రాశాడు. హరిజన సేవకసంఘం స్థాపించారు. తరువాత అది చాలా ప్రయోజనకరమైన పనులు సాధించింది.

కొంతకాలం ప్రజలు తన కార్యక్రమంపట్ల చూపించే ఉదాసీనతకు ఆయన చాలా నొచ్చుకొన్నాడు. 1933 మే 7 వ తేదీని ఆయనకు ఒక అసాధారణమైన అనుభవం కలిగింది. అర్ధరాత్రి హఠాత్తుగా మెలకువ వచ్చిన ఆయనకు ఏదో అంతర్వాణి మరునాటినుంచీ నలభై యొక్క రోజులవరకు ఉపవాసం

చేయుమని ప్రబోధించినట్లు అనిపించింది. ఆయన ప్రశాంతంగా రాత్రి నిద్రపోయి, మరునాటి ఉదయం ఉపవాసం మొదలుపెట్టినట్లు ప్రకటించాడు. ఆ నిశ్చయం ఎవరూ మార్చలేక పోయారు.

ఆయన చెరసాలలో ఉండగా ప్రాణం వదులుతాడేమో అనే భయంకొద్దీ ప్రభుత్వం గాంధీజీ ఉపవాసం మొదలుపెట్టిన తొలిరోజునే విడుదలచేశారు.

ఉపవాసం ఆయనకు 21 రోజులు నిరంతరాయమైన ప్రార్థనగా కొనసాగింది. ఆ ఉపవాసం, కులభేదాలతో కరడుకట్టిన సనాతన హిందూ హృదయాలను సిగ్గుతో చలింపజేసి, వారు మతపూర్వకమైన కట్టుబాట్లను సడలించేటట్లు తోడు పడింది.

గాంధీజీ స్వరాజ్యంకోసం చేసిన పోరాటంతోపాటు అంటరానితనం రూపు మాపడానికి ప్రచారం కొనసాగిస్తూ వచ్చారు. ఆయన దృష్టిలో స్వాతంత్ర్యం అంటే మూఢవిశ్వాసాలనుంచి, అజ్ఞానంనుంచి, విదేశీయుల ప్రాబల్యంనుంచి విముక్తి!





భారతప్రజల ఏకైకనాయకుడుగా గాంధీజీ అందరి హృదయాలను ఆకర్షించాడు. ఇంతకు పూర్వం ఇంతటి బహుముఖ ప్రజ్ఞాశాలి జాతీయ నాయకత్వాన్ని నిర్వహించలేదు. చదువడం వ్రాయడం కూడా రాని కోట్లకొలది జనులంతా ఆయన చెప్పినది అర్థం చేసుకొని, ఆయన చెప్పినదానిని కాదనకుండా అనుసరించారు.

గాంధీజీ సామాన్య రాజకీయవాదిగా జమకట్టవలసినవాడు కాదు. ఉపన్యాస ప్రతిభగాని, నాటకోచితమైన ఆవేశాలనుగాని ఆయన వినియోగపరచలేదు. చిన్న చిన్న మాటలతో, మెత్తని గొంతుతో సిద్ధాంతాలను నచ్చేటట్లు వివరించడం ద్వారా ఆయన శ్రోతలను తనదారికి తీసుకొని వచ్చేవాడు. ఏ విషయమునైనా శ్రద్ధగా స్పష్టంగా వివరించడం ద్వారాను, యుక్తియుక్తంగా మాటాడడంద్వారాను ఆయన శ్రోతలను కరిగించేవాడు.



సంస్కర్తగా, ఉదాత్తమైన హాస్యప్రయోగము తెలిసినవాడుగా, నీతికోవిదుడుగా, రాజనీతిచతురుడుగా ఆయన తన పాత్ర నిర్వహించాడు. రాజనీతిలో ఆయనకుగల సూక్ష్మజ్ఞానము బ్రిటిషువారినే ఆశ్చర్యపరచి, వారిలో క్రొత్త చైతన్యం కలిగించింది.

ఆయన ఇంగ్లీషులో మాటాడినా, వ్రాసినా, ఆయనభాష అప్రయత్నంగా, కట్టలు తెంచుకొన్న నదిలా ప్రవహించేది; అంతే కాదు ప్రతిమనిషికీ బోధపడేటంత సరళంగా ఉండేది.

ఇంగ్లీషును కొట్టినపిండిలాగా స్వాధీనపరచుకొన్న భాషావేత్త గాంధీజీ. ఆడంబరత ఎంతమాత్రం లేకుండా సరళంగా సాగిపోయే ఆయన ఇంగ్లీషుశైలిని క్రైస్తవమతగ్రంథమైన బైబిలు శైలితో సమానంగా పోలుస్తారు.



తన విశ్వాసాలను పరీక్షించుకోవడానికీ, తన సిద్ధాంతాలకు ప్రచారం కలగడానికీ, సత్యాన్ని గుర్తించలేకపోయినవారిని సిగ్గుపరచడానికీ ఆయన తరచుగా తనను తాను శిక్షించుకొనే ఉపవాసాలు చేస్తూండేవాడు.

తాను ఎన్ని ఉపవాసాలు చేసినా, ప్రజల హృదయాలలో ఇంకా ఎంతో పరివర్తన కలగాలని ఆయనకు తోచింది. అందుకని, కొంతబలం కలిగాక, వార్ధాఆశ్రమంలో ఉండగా, ఆయన 1933 నవంబరు 7-వ తేదీని దేశపర్యటన కార్యక్రమం మొదలుపెట్టాడు.

ఆయన వెళ్లినచోటల్లా పెద్దపెద్ద జనసమూహాలు ఉండే సభలలో మాటాడే









వారు. కొన్ని సభలలో జనం ఆయన రాకకోసం గంటలతరబడి వేచిఉండే వారు. పదిమాసాలపాటు ఆయన చాలా పల్లెలూ, పట్టణాలూ తిరిగాడు. ప్రజలు ఆయనకు ఇచ్చిన విరాళాలు 8 లక్షలవరకు చేరినవి. అందులో ఎక్కువభాగం పేదరైతులిచ్చిన రాగి పైసలు. తరచు స్త్రీలు తమ ఒంటిపై నగలు ఒలిచి ఇచ్చివేసేవారు.

హరిజనులను సోదరులనుగా ప్రబోధిస్తూ బృందగానాలు పాడే వారు. సనాతన హిందువులు, హరిజనులు కలిసి ఒకేపంక్తిలో విందులు ఆరగించేవారు. విద్యాసంస్థలు హరిజనులకు ఉచితవిద్యాదానం చెయ్యడానికి అంగీకరించినవి. బడులలోనికి, గుడులలోనికి హరిజనులను ఆదర పూర్వకంగా ఆహ్వానించారు.

హరిజనులు తమ నిత్యజీవితంలో పరిశుభ్రత అలవాటు చేసికోవాలని గాంధీజీ గ్రహించాడు. అప్పుడే వారు మిగిలిన సంఘంతో ఐక్యం కావడానికి వీలుగా ఉంటుంది. ఆయన వారికి ఆరోగ్యకరమైన పద్ధతిలో జీవించడం ఓపికగానేర్పాడు. ఆయన ఒకరోజున మరుగుదొడ్లుశుభ్రపరిచేవాడు.మరొక రోజున హరిజనులప్రవేశానికి అనువుగా దేవాలయాలను తెరిపించేవాడు.



ఈ కార్యక్రమంలో ఎన్నో కష్టాలను, ఇబ్బందులను ఎదుర్కొనవలసి వచ్చింది. ఒక్కొక్కసారి హరిజననాయకులకే ఆయనపై అనుమానాలు వచ్చేవి. అయినా, ఆయన వెనుకంజవెయ్యకుండా తన నిర్మాణకార్యక్రమం కొనసాగించాడు. దేశంలో ఒక కొత్త భావసంపద వ్యాపించసాగింది.

1934 జనవరినెలలో బీహారు భయంకరమయిన భూకంపంవల్ల చాలా నష్టపోయింది. వేలకొద్దీ జనం చనిపోయారు. గ్రామాలలో చాలామంది ఇల్లూ వాకిలీ లేని ప్రజకి సహాయంగా ఇళ్లూ, రోడ్లూ, ఇతరవసతులూ తిరిగి కట్టించవలసి వచ్చింది. ఆ దృశ్యాలను దర్శించిన గాంధీజీకి తాను సాధించదలచుకొన్న మార్పుఅంతా భారతీయగ్రామాలపై కేంద్రీకరించాలని అనిపించింది.

ఆయన అక్టోబరులో కాంగ్రెసు సభ్యత్వానికి రాజీనామా ఇచ్చి, తాను గ్రామపునర్నిర్మాణ కార్యక్రమంలో పూర్తిగా మునిగిపోయాడు. ఈ పనికి వార్ధాలోని కొత్తఆశ్రమం కేంద్రం అయింది. వినోబాభావే, మహదేవదేశాయి, మీరాబెన్, కస్తూర్బాల తోడ్పాటుతో ఆయన గ్రామీణపరిశ్రమలను నెలకొల్పి, రహదారులు శుభ్రంచేయించి, చెత్త పారవేసే గోతులను తవ్వించాడు.





ఆయన ప్రోత్సాహంతో డిసెంబరు నెలలో 1936వ సంవత్సరపు కాంగ్రెసుమహాసభను ఫెయిజ్ పూర్ గ్రామంలో జరిపారు. జవాహర్ లాల్ నెహ్రూ కాంగ్రెస్ అధ్యక్షుడు అయాడు. ఇదంతా గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమానికి బాగా దోహదం చేసింది.

1937లో జరిగిన ఎన్నికలలో కాంగ్రెసుపార్టీకి అఖండ విజయాలు లభించాయి. ఏడు రాష్ట్రాలలో కాంగ్రెసువారే అధికసంఖ్యలో ఎన్నిక అయారు. ఆ తర్వాత పదకొండింట తొమ్మిది రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలు ఏర్పడ్డాయి

గాంధీజీఎన్నో సంస్కరణలనుసూచించాడు. విద్యావిధానంలో దేహశ్రమ కలిగించే పనులనుకూడాచేర్చాలని ఆయన ఆదేశం! వార్ధాలో సమావేశమయిన అఖిలభారత విద్యాప్రణాళికా నిర్ణేతల సభ గాంధీజీ ఆశయాలను ఆచరణలో పెట్టడానికి అంగీకరించారు.

ఆసమయంలో మళ్లీ ఇంకొకసారి ఆయన ఆరోగ్యం చెడి, బొంబాయిలో విశ్రాంతి తీసుకోవలసివచ్చింది. అప్పుడు ఆయన జూహూ సముద్ర తీరాన పిల్లలతో సరదాగా ఆటపాటలలో కాలక్షేపం చేసేవాడు.

తరువాత సరిహద్దు రాష్ట్రానికి వెళ్లడం ఆయనకు ఎంతో ఉత్సాహాన్ని కలిగించింది. సరిహద్దుగాంధి అని పేరుపొందిన గఫార్ ఖాన్ నాయకత్వంకింద ఆ రాష్ట్రంలోని కొండజాతి పఠానులు పూర్తిగా అహింసా వ్రతం స్వీకరించి ఎర్రచొక్కాలవారు (రెడ్ షర్ట్సు) అను పేర ఒక శాంతిసైనికదళాన్ని ఏర్పాటు చేసుకొన్నారు.





కాంగ్రెసుసంస్థ గాంధీజీ సలహాను అడుగుతూ పాటిస్తూఉన్నప్పటికీ. సంస్థ నాయకత్వంలో మార్పులు వచ్చాయి. గాంధీజీ దేశంలో ఇతర సంఘటనలపైకి దృష్టి మరల్చవలసివచ్చింది. స్వదేశసంస్థానాలలోని ప్రజలు స్వాతంత్ర్యంకోసం ఆందోళన సాగిస్తున్నారు. తగాదాలేచిన స్థలాలలో ముఖ్యమైనది రాజకోట. అక్కడి మహారాజును ఠాకూరు అంటారు. ఇతర మహారాజులు ఆయనకు చేయూత ఇచ్చారు. సంస్థానప్రజల తరఫున సర్దార్ వల్లభభాయ్‌పటేల్‌కు రాజకోట ఠాకూర్ వెనుకచేసిన వాగ్దానపు షరతులను పాటించలేదు. ఠాకూర్ అక్కడిప్రజల సహాయనిరాకరణోద్యమాన్ని కఠినచర్యలద్వారా అణిచివేశాడు. సంస్థానపౌరులుకాని 'బయటివారి'కి సంస్థానంలో ప్రవేశాన్ని నిషేధించాడు.

గాంధీజీకి ఆరోగ్యం బాగాలేదు. రాజకోట కాపురస్తుల అడుపడుచయిన కస్తూర్బా రాజకోటలోని ప్రజల ఉద్యమంలో చేరాలని కోరింది. ఆమెని ఆపడానికి చేసిన ప్రయత్నాలు నెగ్గలేదు. 1939, ఫిబ్రవరి 3 వ తేదీ ఆమె రాజకోట నగరంలో ప్రవేశించింది; అరెస్టు అయింది. దీనివల్ల సంఘర్షణలు పెచ్చు

పెరిగాయి. మరెంతమందో జనం అరెస్టు అయారు. గాంధీజీ తన అనారోగ్యం సంగతి బయటకు పొక్కనీయకుండా, సర్దుబాటుకై ప్రయత్నించాలని రాజకోట వెళ్లాడు. కాని, ఠాకూరు మొండికెత్తాడు. ప్రాణంపోయేవరకు ఉపవాసం చెయ్యాలని మార్చి 3 వ తేదీని గాంధీజీ నిశ్చయించాడు. ఇది ఆయన మిత్రులకు, సహచరులకు, అభిమానులకు అదుర్దా కలిగించింది.

మార్చి 5 వ తేదీని కస్తూర్బాను గాంధీజీని చూడటానికి తీసుకొనివచ్చారు. ఆమెతోపాటు అరెస్టు అయిన ఇతరస్త్రీలు అందరూకూడా విడుదల అయారా అని గాంధీజీ అడిగాడు. వారు విడుదలకాలేదు. అందుకని ఆయన కస్తూర్బాను తిరిగి జైలుకు వెళ్లిపొమ్మన్నాడు. ఇతర స్త్రీలకు కలిగించని ప్రత్యేక సదుపాయాలు స్వీకరించవద్దని ఆయన కస్తూర్బాకు చెప్పాడు.

ఆయన ఆరోగ్యపరిస్థితి విషమించింది. మంచినీటిచుక్కయినా లోపలికి తీసుకోలేనిస్థితిలో ఉన్నాడు. అంతం సమీపించిందని అనిపించింది. అప్పుడు వైస్రాయ్, ఇండియా ప్రధానన్యాయాధిపతి అయిన సర్ మారిస్ గయర్‌ను మధ్యవర్తిత్వం చేయుమని కోరాడు. అందుకు ఠాకూరుకూడా ఒప్పుకొన్నాడు. గాంధీజీ ఉపవాసం విరమించాడు.





ఠాకూరు వెనుకచేసిన ఒప్పందపు షరతులను పాటించలేదని సర్ మారిస్ ప్రకటించాడు. అప్పుడు ఒక కొత్తఒప్పందంపైని సంతకాలు పెట్టారు.

రాజకోట రాజా అయిన ఠాకూరు ఒప్పందం షరతులను తిరిగి ఉల్లంఘించాడు. అంతేకాదు, గాంధీజీకి వ్యతిరేకంగా ఒక ముఠాచేత ఆందోళన చేయించాడు.

గాంధీజీ నడుపుతున్న ప్రార్థనసభలోకి వందలకొద్దీ జనం గుంపులుగుంపులుగా నల్లజెండాలతో నినాదాలుచేస్తూ సభను చెదరగొట్టడానికి వచ్చారు. జనం వేదికపైకి వెళ్లి గాంధీజీని చుట్టుముట్టారు. గాంధీజీ స్నేహితులు ఆయనచుట్టూ మూగి ఆయనకు రక్షణ కల్పిస్తామంటే గాంధీజీ ససేమిరా వద్దన్నాడు. "నేను ఇక్కడే కూర్చుంటాను - ఒంటరిగా జనం మధ్యకు వెడతాను" అని చెదరని మనోనిశ్చయంతో గాంధీజీ కదలలేదు.

ఆయన లేచి నిలబడగానే వెన్నులో హఠాత్తుగా ఆపరాని నొప్పి పుట్టింది. ఆయన నొప్పిని మర్చిపోడానికి ప్రార్థనాపూర్వకంగా కళ్లు మూసుకొన్నాడు. ఆ వెంటనే శక్తి కూడదీసుకుని ఆయన కళ్లు తెరిచాడు. ఆయన తనమిత్రులతో తనని ఆ జనసమూహపు దయాదాక్షిణ్యాలకు విడిచిపెట్టండని చెప్పినాడు.

గాంధీజీ ముఠానాయకుడిని పిలిచి, 'నేను నీ చెప్పుచేతలలో ఉన్నాను; నీ యిష్టం' అని చెప్పాడు. అక్కడిజనం హృదయాలలోని హింసాభావం మంచులాగ కరిగిపోయింది. గాంధీజీ తనబసకు వెళ్లడానికి ఆ ముఠానాయకుడు

ఆసరా ఇస్తానన్నాడు. ఆ సాయంత్రం గాంధీజీ తనని కొట్టడానికివచ్చినమనిషి భుజంమీద చేయివేసుకుని తోవపొడుగునా నడుచుకుంటూ బస చేరాడు.

1939 సెప్టెంబరులో రెండవ ప్రపంచయుద్ధం మొదలయింది. దేశంలోని ప్రజానాయకులతో సంప్రతించకుండానే వైస్‌రాయ్ ఇండియా యుద్ధంలో పాల్గొంటుందని ప్రకటించాడు. జర్మనీదౌర్జన్యం ఖండించవలసిందే కాని, యుద్ధంలో పాల్గొనడానికి నిశ్చయించవలసినవారు ఇండియా ప్రజలే అని కాంగ్రెసువారు ప్రకటించారు.

స్వతంత్రభారతదేశం మాత్రమే తన ముందుగతిని దిద్ది తీర్చుకోగలదని స్పష్టపరిచారు దేశనాయకులు. బ్రిటనుకు యుద్ధంలో సహాయంఅంటూ కావల్సి వస్తే ఇండియాకు సిసలయిన స్వాతంత్ర్యం ఇచ్చితీరాలన్నారు. 1940 ఆగస్టులో వైస్‌రాయ్, తమరాజ్యాంగవిధానాన్ని తయారుచేసుకునే హక్కును భారతీయుల





కిస్తామని వాగ్దానంచేశాడు. అయితే, ఆ రాజ్యాంగం సంస్థానాల పాలకులయిన మహారాజులకు, ముస్లిములకూ కూడా ఒప్పుకోతగినదై ఉండాలన్నాడు. దేశనాయకులు ఆ వాగ్దానాన్ని తిరస్కరించారు.

అక్టోబరులో గాంధీజీ ఒక సత్యాగ్రహం ప్రారంభించాడు. పెద్దలైన నాయకులంతా అరెస్టుకాగానే, జనం తండోపతండాలుగా సత్యాగ్రహంలో చేరారు. ఒకే నినాదం దేశంఅంతటా మారుమోగింది : "బ్రిటిషువారి యుద్ధప్రయత్నాలకి మనం మనుష్యులద్వారాగాని, ధనరూపంగాగాని సహాయం చెయ్యడం తప్పు. అహింసాత్మక సహాయనిరాకరణద్వారా యుద్ధయత్నాలను నిరోధించడమే మనం చెయ్యతగిన పని."

కొన్ని నెలలలోనే 20,000 మందికి జైలుశిక్ష పడింది. ఒకసమయంలో ఒకేసారి 14,000 మంది జైలులో ఉన్నారు.

జపానువారి దురాక్రమణభయం ఇండియా సరిహద్దులకు దరిదాపుగావస్తున్న సమయంలో బ్రిటిషువారు మనవారితో ఏదో ఒక రాజీనిర్ణయానికి రావాలని నిశ్చయించుకొన్నారు. 1942 మార్చిలో బ్రిటిషు మంత్రివర్గసభ్యుడయిన సర్ స్టాఫర్డు క్రిప్సును కొత్త రాజీసూచనలతో భారతీయ నాయకులతో రాయబారాలకు పంపారు. కాని రాయబారాలు పూర్తిగా విఫలం అయినవి.

గాంధీజీ ఇలా అన్నాడు: "బ్రిటిషు ప్రభుత్వం క్రిప్స్‌ద్వారా పంపిన రాజీ సూచనల వివరాలనుగురించి వదంతు లేవో విన్నాను గాని, లోపల ఏముందో చూడలేదు. అతడు ఆ పత్రాలను నాకిచ్చాడు. వాటిని నేను చూడాయగా చదివి అతనితో ఇలా అన్నాను: 'మీరిచ్చేది ఇంతమాత్రమే అయితే మీ రెందుకయ్యా ఇక్కడికిరావడం? మీ దేశానికివెళ్లే మొదటివిమానం ఏదో తెలుసుకొని, వెంటనే వెనక్కు వెళ్లమని నా సలహా' అని. దానికి క్రిప్సు 'మీ సలహాను పరిశీలిస్తాను' అని జవాబిచ్చాడు.

ఇతరనాయకులుకూడా ఆశాభంగం పొందారు. ఈ కొత్త పథకంద్వారా ఏ భారతీయసంస్థానానికైనా రాష్ట్రానికైనా కొత్తరాజ్యాంగాన్ని నిరాకరించే హక్కు ఇచ్చారు. దీనివల్ల ఇండియా శాశ్వతంగా ఎన్నోముక్కలుగా విభక్తం అయిపోయి ఉండేది. అంతేకాకుండా దానిప్రకారం ప్రభుత్వం పూర్తిగా భారతీయుల వశంలోకి రాదు.

ఈసమయంలోనే గాంధీజీకి 'క్విట్ ఇండియా' తీర్మానం తట్టింది. ఈ సందర్భం గురించి ఆయన తరవాత ఏం వ్రాశాడంటే,-"క్రిప్స్ రాయబారం ఫలించక పోవడంవల్ల నాకీ అభిప్రాయం కలిగింది. అతడు వెళ్లాడో లేదో, ఈ అభిప్రాయం నన్ను అదేపనిగా పట్టుకొంది. మొదట నాకు ఏం అనిపించిందంటే, - క్రిప్స్ వైఫల్యానికి మనం తగిన జవాబు ఇయ్యాలి" - అని.

1942 జూలై 14 వ తేదీని కాంగ్రెస్ కార్యవర్గసభ వార్ధాలో సమావేశమై, 'క్విట్ ఇండియా' (ఇండియా వదిలి వెళ్లిపోండి) తీర్మానాన్ని ఆమోదించింది. తీర్మానం ముసాయిదా గాంధీజీయే తయారు చేశాడు.



ఆ తీర్మానం ప్రకారం ఇండియాలో బ్రిటిషు పరిపాలన వెంటనే అంతంకావాలి. కాకపోతే, తమ స్వయంపరిపాలన హక్కు స్థిరపడేదాకా -

1920 నుంచీ కాంగ్రెసువారు తమ అహింసాత్మకమైన పోరాటంద్వారా కూడ దీనుకొన్న ప్రజాభిప్రాయం తోడ్పాటుతో పెద్ద ఉద్యమం నడిపిస్తారు.

ఆగస్టు 8 వ తేదీని బొంబాయిలోని గోవాలియా టాంక్ మైదానంలో అఖిల భారత కాంగ్రెసు కార్యవర్గం సమావేశమయి, క్విట్ ఇండియా తీర్మానాన్ని పూర్తిగా ఆమోదించింది. అహింసాత్మకంగా పెద్దపెట్టున దేశం అంతటా ప్రజల ఉద్యమం ప్రారంభించాలని ఆ సభవారు ప్రకటించారు. ఉద్యమం గాంధీజీ నాయకత్వంలోనే సాగుతుంది.

గాంధీజీ ఆ సభలో అన్న మాటలు: "ఈ ఉద్యమంలో నేను మిమ్మల్ని ముందుకు నడిపించడం మీ సేనాధిపతిగా కాదు; మీ అధికారిగా కాదు; మీ



కందరికీ వినయపూర్వక సేవకుడుగా మాత్రమే! అందరిలోను ఎవరు ఎక్కువ సేవచేస్తారో అతడే నాయకుడు!"

అది ఒక గొప్పసమయం—భారతదేశ చరిత్రయే మలుపు తిరిగిన ఘట్టం! నాయకులంతా గోవాలియా టాంక్ మైదానపు సభలో పాల్గొన్నారు. కాంగ్రెస్ నుంచి అంతకుముందు రాజీనామా ఇచ్చిన కొందరుకూడా కలిసి, కాంగ్రెస్ సంస్థ అంతా ఒక్కటిగా చేరి పోరాడి, స్వరాజ్యం సంపాదించడానికి సిద్ధంగా ఉన్నది.

సభ ఆవరణకి బయట పెద్ద జనసమూహం గుమిగూడి ఉంది. వాతావరణం





అంతటా ఉద్రేకంతో కుతకుతలాడుతోంది; జాతిజాతి అంతా ఏం జరగబోతూ ఉందని ఉగ్గబట్టుకుని ఊపిరి బిగపట్టి ఎదురు చూస్తున్న సమయం అది.

జనసమూహం నాయకు లందరికీ జేజేలు చెప్పి, వారు ఏది చెపితే అది చెయ్యడానికి సిద్ధంగా ఉంది. గాంధీజీ-వారికి ఉద్యమం మొదలుపెట్టండని ఇంకా ఆదేశం ఇయ్యలేదు. కాని, బ్రిటిషుప్రభుత్వం, వారిని శాంతంగా ఉండనియ్య లేదు. జనాన్ని భయపెట్టి, చెదరగొట్టడానికి, కారణం లేకుండానే జనంలోకి బాష్పవాయువు వచ్చే బాంబులను పేల్చారు. ఉద్యమంలో పాల్గొనబోయే వారికి జరుగబోయే మర్యాదలు ఎలా ఉండగలవో ఈ సంఘటనద్వారా తెలిసిపోయింది.

ఆ మరునాటి ఉదయమే ప్రభుత్వం గాంధీజీని, కాంగ్రెసుకు చెందిన ప్రముఖ నాయకులను అరెస్టుచేసింది. గాంధీజీని పూనాలోని ఆగాఖాన్ భవనంలో ఉంచారు. ఆయన అక్కడ ఖైదీగా రెండేళ్ల గడిపారు. కస్తూర్బా కూడా ఆయనతోనే ఉంది.

గాంధీజీ అరెస్టువార్త దేశంలో వ్యాపించగానే పెద్ద విప్లవం (తిరుగుబాటు) జరిగింది. ఆ తిరుగుబాటులో దౌర్జన్యవాదులు, కాంగ్రెసువారుకానివారు పాల్గొన్నారు. చేతిలో ఏ ఆయుధమూలేని జనుల గుంపులను పోలీసులు చావ బాదారు. విచ్చలవిడిగా తుపాకిగుండ్లు వదిలారు. పట్టుబడ్డ విప్లవవీరులను



కొరడాలతో క్రూరంగాకొట్టి, విచారణలేకుండా నేలమాళిగజైళ్లలో పారవేశారు.

నాయకులు అరెస్టుకాగానే దేశంలో జరిగిన కల్లోలాలకు కాంగ్రెసూ, గాంధీజీ కారణం అని భావించింది ప్రభుత్వం. ఇది అసత్యమని గాంధీజీ వైస్రాయ్‌కి వ్రాస్తూ, దేశంలో శాంతి నెలకొల్పడానికి వీలుగా తమ అందరినీ విడుదల చెయ్యమని కోరాడు. దానికి వైస్రాయ్ జవాబియ్యలేదు.



ఆ తర్వాత మళ్లీ డిసెంబరులో ప్రజలకు నిజాన్ని తెలియజెయ్యమనీ, అలా చెయ్యకపోతే, తాను సత్యాగ్రహం చెయ్యవలసి వస్తుందనీ వ్రాశాడు. ఉపవాసం ద్వారా దేహాన్ని బాధింపజేసుకోవడమే ఆ సత్యాగ్రహం!



"చనిపోయేవరకు ఉపవాసం చెయ్యగోరటంలేదు నేను; భగవంతునికి ఇష్టమైతే, ఈ ఉపవాసపరీక్షలో నెగ్గడమే నా ఆశయం" అన్నాడాయన.

1943, ఫిబ్రవరి 18-వ తేదీని ఉదయపు అల్పాహారం కాగానే ఆయన



21 రోజుల ఉపవాసం ఆరంభించాడు. ఆయన అనారోగ్యం అందరికీ అదుర్దా కలిగించింది. నిద్ర సరిగా లేక, ఆయన బాగా నీరసించి పోయాడు. రెండు రోజులు కాగానే ఆయన ప్రాణాలు నిలవవేమో అని వైద్యులు భయపడ్డారు.

దేశంఅంతటా ప్రజలు అసమ్మతి ఊరేగింపులూ, ప్రార్థనలూ చేశారు.

చాలమంది పేరుకెక్కిన ఆంగ్లేయులే గాంధీజీపట్ల బ్రిటిషు ప్రభుత్వపు వైఖరిని ఖండించారు. ఇంగ్లండ్‌రాజు మంత్రివర్గ సభ్యుల మానసిక దౌర్బల్యాలను బెర్నార్డ్ షా (కవి) విమర్శించాడు. స్వరాజ్యోద్యమసత్యాగ్రహాలపైని ప్రభుత్వపు పోలీసుచర్యలను చర్చిల్ మాత్రము సమర్థిస్తూ వచ్చాడు.

అధికార సమాచారం ప్రకారమే పోలీసుల తుపాకీ కాల్పులు 470 సార్లు, మిలిటరీ వారి కాల్పులు 67 సార్లు జరిగాయి. 1942 డిసెంబరు వరకు 60,000 మంది భారతీయులు అరెస్టు అయారు. 1943 ఫిబ్రవరి నాటికి 39,000 మంది ఇంకా జైళ్లలో ఉన్నారు. అందుకే ఈ ప్రభుత్వచర్యలను గాంధీజీ 'సింహ దౌర్జన్యం' అని వర్ణించాడు.

అందరికీ ఊరట కలిగించిన విషయం ఏమిటంటే గాంధీజీ ఉపవాసంనుంచి బతికి బయటపడడమే. మార్చి 3 వ తేదీని కస్తూర్బా ఇచ్చిన నారింజరసం త్రాగి, ఆయన ఉపవాసం విరమించాడు.



1943 రెండవసగంలో బెంగాలురాష్ట్రంలో భయంకరమైన కరవు వచ్చింది. జనం 15 లక్షలమందిదాకా చనిపోయారు. గాంధీజీ బెంగాలులోని ఆకలిగొన్న ప్రజలకు సేవచేస్తానని ప్రభుత్వానికి తెలియజేశాడు. కాని ప్రభుత్వం ఆయన్ని విడుదల చేయలేదు.

ఆగాఖాన్ భవనంలో గాంధీజీతోపాటు ఖైదీగా ఉండిన కస్తూర్బా చావుబతుకులమీద ఉంది. నవంబరులో ఆమెకు రెండుమూడుసార్లు గుండెజబ్బు చేసింది. అయినా ప్రభుత్వం ఆమెను విడుదల చెయ్యదలచుకోలేదు.



1944 ఫిబ్రవరి 22 వ తేదీని 75 ఏళ్ల కస్తూర్బా చనిపోయింది. గాంధీజీతో 60 ఏళ్లపాటు విడవకుండా కాపురంచేసిన కస్తూర్బా అసాధారణ స్త్రీ. ఆమె చెరసాలలో ఉండగా చనిపోవడం దేశం అంతటా ఉద్రేకం కలిగించింది. ఆగాఖాన్ భవనం ఆవరణలో వందలకొద్దీ మిత్రులు ఆమె అంత్యక్రియలకు సమావేశమయి, ఆమె ఆత్మకు జోహారు లర్పించారు.

కస్తూర్బాయెడల ప్రజలు తమకు గల ప్రగాఢమైన గౌరవానికి గుర్తుగా కస్తూర్బా స్మారకనిధిని ఒకదానిని ఏర్పాటుచేసి, దానిని భారతీయ గ్రామాలలోని స్త్రీలను, పిల్లలను ఉద్ధరించడానికి వినియోగిస్తూ వచ్చారు.

ఆ తర్వాత గాంధీజీ ఆరోగ్యం చెడింది. కొత్త వైస్‌రాయ్ వేవెల్ ప్రభువు మే 6 వ తేదీని ఆయన్ని విడుదల చేయించాడు.

కొంతకాలం విశ్రాంతి తీసుకొని ఆరోగ్యం బాగుపడాక, గాంధీజీ బ్రిటన్, భారతదేశాల సంబంధాలను గురించి వైస్‌రాయితో సంభాషణలు ప్రారంభించాడు. ఆ సందర్భంలోనే కాంగ్రెస్ పక్షానికీ, ముస్లింలీగుకూ, ఉభయులకూ సమ్మతమయే ఉమ్మడిపథకం ఒకటి తయారుచెయ్యడానికి గాంధీజీ మహమ్మదలీ జిన్నాతో సంభాషణం ద్వారా ప్రయత్నించాడు ఈ సంభాషణలలో ఆయనకు చక్రవర్తి రాజగోపాలాచారి సహాయంచేశాడు. ఈ





సంభాషణల ఫలితంకోసం ఇండియా ప్రజ లంతా ఆత్రంగా ఎదురుచూశారు. దేశం భవిష్యత్తు ఆ ఫలితంపైని ఆధారపడిఉంది. ఆ సంభాషణలవల్ల కొంత ఫలితం సాధించ గలిగారు.

సంప్రతింపులు చాలా జరిగాయి. ముస్లిం లీగు తరఫున నాయకుడైన మహమ్మదలీ జిన్నా పాకిస్తాన్ అనే ప్రత్యేకరాజ్యం కావాలని పట్టుపడుతూ వచ్చాడు.

1946 మార్చిలో ఇండియా భవిష్యద్రాజ్యాంగం తయారుచేసుకొనేటందుకు సహాయపడడానికి బ్రిటిషుప్రభుత్వం ముగ్గురు బ్రిటిషు మంత్రివర్గ సభ్యులను ఇండియాకు పంపింది. (కేబినెట్ మంత్రుల రాయబారం.)

దానిఫలితంగా సెప్టెంబరు 2 వ తేదీని జవాహర్‌లాల్‌నెహ్రూ ప్రధాన మంత్రిగా తాత్కాలిక కేంద్రప్రభుత్వం ఏర్పాటు అయింది. అడుగడుగునా గాంధీజీ సలహాలు తీసుకుంటూనే ఉన్నారు.

ఆ ప్రభుత్వంలో సభ్యులు కాదగ్గ ముస్లిం మంత్రులను తామే పేర్కొవా లని ముస్లింలీగు పట్టుపట్టింది. (కాంగ్రెస్‌వారు అందుకు ఒప్పుకోనందువల్ల) ఆ తాత్కాలికప్రభుత్వంతో సహకరించడానికి జిన్నా నిరాకరించాడు. ఆగస్టు 16వ తేదీని ప్రత్యక్షచర్యాదినంగా పాటించాలనీ, సెప్టెంబరు 2 వ తేదీని నల్లజెండాల



ద్వారా తమ వ్యతిరేకత ప్రకటించాలనీ ముస్లింలీగువారు నిర్ణయించారు.



ఆగస్టు 16 వ తేదీని కలకత్తాలో కలహాలు చెలరేగి 5000 మంది ప్రజల ప్రాణాలు పోయాయి. అల్లరులు దేశంలో ఇతర ప్రాంతాలకుకూడా వ్యాపించాయి. అల్లరులు జరిగినచోట శాంతి నెలకొల్పడానికి గాంధీజీ కలకత్తా వెళ్లాడు.

ఆ తరవాత ఏవో కొన్ని షరతులపైని ముస్లింలీగు సభ్యులుకూడా తాత్కాలిక ప్రభుత్వంలో చేరారు. నెహ్రూతోపాటు ముస్లింలీగు మంత్రి అయిన అబ్దుర్ రబ్ నిష్తార్ కూడా కలకత్తా వెళ్లాడు.



గాంధీజీ కలకత్తాలో ఉండగా, బెంగాల్‌లోని నవఖాలీ, తిప్పెరాజిల్లాలలో హిందువులు మతదౌర్జన్యాలకు గురి అయ్యారని విన్నాడు. ఆ హింసాకాండ గ్రామాలలో జరిగినందుకు ఆయన ఎంతో బాధపడ్డాడు. ఈ మతవిద్వేషాలు గ్రామాలలో చొరబడ్డాయంటే జాతికి వినాశకరమని ఆయన భయపడ్డాడు.

ఆరోగ్యం అంత బాగాలేకపోయినా, గాంధీజీ నవఖాలీ వెళ్లాడు. ఆయన 1946 నవంబరు, 1947 మార్చినెలలమధ్య 49 గ్రామాలు పర్యటించాడు. తరచు కాలినడకనే ప్రయాణించేవాడు; అక్కడ జరిగిన హింసాకాండకు ప్రాయశ్చిత్తంగా ఆయన చేసినది తపోయాత్ర।

బీహారులోకూడా మతవర్గాలమధ్య కలహాలు జరిగాయని తెలిసి, బాపూ అక్కడ హింసపాలయిన ముస్లిములకు సహాయంచెయ్యడానికి వెళ్లాడు.

1945 ఆగస్టు 6 వ తేదీని జపానులోని హిరోషిమాలోను, ఆగస్టు 9 వ తేదీని నాగసాకీలోను ఆటంబాంబులు వేశారు. బాంబునుంచి పైకిలేచిన గొడుగు వంటి మేఘం ఆకాశంలో మైళ్లకొద్దీ ఎత్తున పైకెగిరి చుట్టుపక్కల 200 మైళ్ల దాకా కనబడింది. ఆ రెండు నగరాలూ పూర్తిగా నాశం అయిపోయి, జపాను వారు మిత్రరాజ్యసైన్యాలకు లొంగిపోయారు.

"అహింస ఒక్కటే ప్రపంచంలో మిగిలింది. ఆటంబాంబు నాశంచెయ్యలేని శక్తి అంటూ ఏదయినా ఉంటే అది అహింసే" అని గాంధీజీ ప్రకటించాడు.

ప్రపంచంలోని గొప్ప విజ్ఞానశాస్త్రవేత్తలలో ఒకడయిన అల్బర్ట్ ఐన్‌స్టయిన్ గాంధీజీని ఏమని కొనియాడాడో తెలుసా? "కొన్నితరాలు గడిచాక, - రక్తమాంసాలుగల ఇటువంటి దివ్యమానవుడు ఈ భూమిపై తిరుగాడిన విషయం నమ్మడానికి వీలులేదని చెప్పుకొంటారు జనం" అని





1947 మార్చి 23-వ తేదీని ఢిల్లీలో జరిగిన 'అంతర్జాతీయ ఆసియా బాంధవ్య మహాసభ'లో ఉపన్యసించుమని గాంధీజీని కోరారు. ఆసియా ఖండంలోని వేరు వేరు దేశాలనుంచీ, సోవియట్ యూనియన్ (రష్యా) లోని రాజ్యాలయిన అయిదు రిపబ్లిక్కులనుంచీ ప్రతినిధులు వచ్చి, ఆ సభలో తమలో తాము సహకారము, సంబంధాలు పెంపొందించుకొనడం గురించి చర్చించారు.

ఆ సభలో ఉపన్యసిస్తూ గాంధీజీ "భారతదేశపు నిజమైన ఆత్మను దర్శించాలంటే పాశ్చాత్య నాగరికత బలిసిపోయిన పట్టణాలలో కాదు సుమా-దేశంలోని 7,00,000(ఏడులక్షల) గ్రామాలలోనే వీలుపడుతుంది. ప్రపంచంలోని గొప్పగొప్ప మతాల ప్రవక్తలంతా, జీససు క్రైస్తుతో సహా, తూర్పుఖండం నుంచే వచ్చారు. అందుచేత ఈ సభలో పాల్గొన్నవారంతా తూర్పుఖండపు సందేశాన్ని పడమటి దేశాలలో ప్రచారం చేయాలి. కొన్నాళ్లపాటు మీ ప్రజలపై అన్యాయంగా అధికారం చలాయించారు కదా అని ఆ రాజ్యాలవారిపైని మనస్సుల్లో ద్వేషం పెంచుకోక, మీ దేశాల విజ్ఞానాన్ని వారికి అందజెయ్యండి" అని ప్రబోధించాడు.

1947 మార్చిలో మౌంట్‌బాటన్ ప్రభువు వైస్‌రాయ్ అయాడు. ఆయన

ఇంగ్లండ్ రాజుకు వేలువిడిచిన సోదరుడు, విక్టోరియారాణికి మునిమనుమడు. మౌంట్‌బాటన్ ప్రభువు, ఆయన సతీమణి ఢిల్లీ రావడంతో తమతోపాటు ఒక కొత్త చైతన్యాన్ని తీసుకొని వచ్చారు. ఆయన ఇండియాకు తాను వచ్చినది బ్రిటిషుపరిపాలన అంతమొందించడానికే అని వస్తూనే ప్రకటించాడు.

తన్ను కలుసుకోమని ఆయన గాంధీజీని ఆహ్వానించినాడు. అప్పుడు బీహారులో ఉండిన గాంధీజీ-తన ప్రయాణానికి వైస్‌రాయ్ ప్రత్యేకవిమానాన్ని పంపినాకూడా, మామూలుగా రైలులో మూడవతరగతిలోనే ప్రయాణంచేశాడు. ఇద్దరూ రెండు గంటలు చర్చించుకొన్నారు. ఆ క్షణంనుంచి వారిద్దరిమధ్యా ఒక గాఢమైన, విశుద్ధమైన, ఎన్నడూ మరపురాని మైత్రి ఏర్పడింది. పన్నెండు రోజులలో వారిద్దరూ ఆరుసార్లు సమావేశం అయ్యారు.

మౌంట్‌బాటన్ దంపతులకు గాంధీజీఅంటే ఎంతో గౌరవం. గాంధీజీకి వారంటే పరమవిశ్వాసం; బ్రిటిష్ సామ్రాజ్యం నష్టపోయినా ఈ వైస్‌రాయ్ మాత్రం ఇండియాకు నిజంగా సహాయం చెయ్యడానికే వచ్చాడని గాంధీజీ గ్రహించాడు.

గాంధీజీ గ్రహించింది యథార్థమే. అయితే, గాంధీజీ ముందెన్నడూ అను





కొని పరిస్థితులలో తనకు ఏమాత్రమూ ఇష్టంలేని పద్ధతిలో వచ్చింది మన స్వరాజ్యం. కాంగ్రెసువారి కోరికా, ముస్లింలీగువారి కోరికా పరస్పరం వ్యతిరేకంగా ఉండడంచేత దేశాన్ని రెండుభాగాలు చెయ్యవలసి వచ్చింది. గాంధీజీ ఎందరో నాయకులను కలుసుకున్నా కూడా లాభం లేకపోయింది.

పంజాబ్, బెంగాల్ రాష్ట్రాలను విభజించడంద్వారా పాకిస్తాన్ ఏర్పాటు చెయ్యడానికి కాంగ్రెసుపక్షం ఒప్పుకొన్నదని గాంధీజీ ఒక ప్రార్థన సభలో ప్రకటించి, దానిని గురించి సొంత అభిప్రాయం ఇలాగ వెల్లడించాడు: ''ఇండియాను ఏవిధంగా అయినాసరే విభజించడం నాకు సమ్మతం కాదు.... దేవుడుతప్ప వేరెవ్వరూ నన్ను అలాటి నిర్ణయానికి సమ్మతించేటట్లు ఒత్తిడి చెయ్యలేరు; ముప్ఫయిరెండు సంవత్సరాలుగా పడిన శ్రమఅంతా బూడిదలోపోసిన పన్నీరయింది. ఆగస్టు 15-వ తేదీన జరిగే ఉత్సవాలలో నేను పాల్గొనలేను—''అని.

గడియారం అర్ధరాత్రి 12 గంటలు కొట్టింది. భారతభూమిపైని నవోదయపు అరుణకాంతి ప్రసరించింది. అది 1947 ఆగస్టు 15-వ తేది నూటతొంభై యేళ్ల నుంచి బ్రిటిషుపరిపాలనలో ఉండిన భారతదేశం స్వతంత్రరాజ్యం అయింది.

న్యూ ఢిల్లీలోని పార్లమెంటు భవనపు విశాలమైన హాలులో మౌంట్‌బాటన్ ప్రభువు భారతదేశపుస్వాతంత్ర్యాన్ని ప్రకటించే అధికారపత్రాన్ని చదివాడు. అది అయినవెంటనే ఆనందపూరితమైనజయజయధ్వానాలు చెలరేగాయి. ఫిరంగులు పేలాయి. ప్రార్థనాలయాలలో గంటలు మ్రోగాయి. ఆ చారిత్రిక సంఘటనకు దేశమంతా మంగళవాద్యాలతో స్వాగతం చెప్పింది.

"ప్రపంచం నిద్రపోతున్న సమయంలో భారత దేశం కొత్తజీవితంలోకి మేలుకుంది" అన్నాడు ప్రధానమంత్రి జవాహర్‌లాల్‌నెహ్రూ.

ఆ శుభసమయంలో మాటాడుతూ ఆయన ఇంకా ఏమన్నాడంటే: "నిర్ణయించుకొన్నప్రకారం శుభ దినం వచ్చింది - విధి నిర్ణయించిన దినం అది - దీర్ఘకాలం నిద్రలో, విముక్తిపోరాటంలో గడిపిన భారత దేశం మేలుకొని, దృఢంగా, స్వతంత్రమై, స్వపరిపాలనలో మళ్లీ గౌరవంగా నిలబడగలిగింది...."

"ఇది మనకూ, ఆసియాఖండానికంతకూ, ప్రపంచానికంతకూ కూడా జీవితమార్గాలను కొత్తగా దిద్దితీర్చే సుముహూర్తం....

"మనచుట్టూ మబ్బులు కమ్ముకొనిఉన్నప్పటికీ, మన







తోటిప్రజలు చాలామంది విచారంలో మునిగిఉన్నప్పటికీ, ఎన్నో క్లిష్టసమస్యలు మనని ముంచెత్తిఉన్నప్పటికీ, ఈ స్వాతంత్ర్యం మనకు ఆనందదాయకం!....

"భారతదేశపు సనాతన సత్సంప్రదాయం మనిషిగా అవతరించిన గొప్పవ్యక్తి, స్వాతంత్ర్యపు కాగడాతో మనచుట్టూ మూగిన అంధకారాన్ని పారదోలిన మహాత్ముడు, మన స్వాతంత్ర్యభవనాన్ని నిర్మించిన మహాశిల్పి, మన జాతి పితయైన గాంధీజీకి కృతజ్ఞతతో వందనం చెయ్యడానికే ఈనాడు మన మనస్సులు ముందుగా పరుగుపెడుతున్నాయి.

"ఆ తరువాత, ఒకరి మెప్పుకోసంగాని, ఏ బహుమానంకోసంగాని ఆశించక ఇండియా స్వాతంత్ర్యంకోసం పోరాడి ప్రాణాలు కోలుపోయిన ఊరు, పేరు తెలియని దేశ సేవకులయిన స్వరాజ్యయోధులను ఈనాడు మనం స్మరించి తీరాలి....

"ప్రపంచంలోని వివిధజాతులకు, ప్రజలకు మన శుభాకాంక్షలు పంపి, శాంతి, స్వాతంత్ర్యము, ప్రజాస్వామ్యము వర్ధిల్లజెయ్యడానికి వారందరితో సహకరించగలమని ప్రమాణం తీసుకొంటున్నాము....

"మరి మన ప్రియతమమైన మాతృభూమికి, ఈ పురాతన, శాశ్వత, నిత్య నూతన పుణ్యభూమికి ఇండియాకు మన భక్తిపూర్వకమైన అంజలి జోడించి, మన జీవితాలను ఆమె సేవకై పునరంకితం చేసుకొంటున్నాము."

ఒక తుపాకి గుండయినా పేల్చకుండా పొందిన ఈ అద్భుత విజయానికి కోట్లకొలది భారతీయులు ఉత్సవాలు జరుపుకొన్నారు. దేశం అంతటా దీప తోరణాలు, అలంకారాలు, కవాతులు, ఊరేగింపులు జరిపి గీతనృత్యాలతో



వినోదించారు. అంతే కాకుండా వేలకొలది పతాకోత్సవాలు జరిగాయి.

ఢిల్లీలోని ఎర్రకోట (లాల్ ఖిల్లా) బురుజుపైని, కాషాయం, తెలుపు, ఆకుపచ్చరంగుల జాతీయ పతాక సగర్వంగా రెపరెపలాడింది. ఈ అపూర్వ అవకాశాన్ని దర్శించడానికి ఢిల్లీకి కోట్ల కొద్దీ జనం చేరుకొన్నారు. ఎర్రకోట ముందు ఎందరో జనం తండోపతండాలుగా నిలబడి భారత జాతీయపతాకకు





వందనం చేశారు. మళ్ళీ ఇంకొకసారి నడుస్తున్న భారతజాతి చరిత్రకు కేంద్ర స్థాన గౌరవం పొందింది - లాల్‌ఖిల్లా !

ప్రజలు ఎల్లపుడూ క్షమాగుణంతో ఉంటారు. వారి హృదయాలలో ఏ కోశాన్నీ బ్రిటిషువారిపట్ల ద్వేషం లేదు. మౌంట్‌బాటన్ ప్రభువు భారతీయుల హృదయాలను చూరగొన్నాడు. వారంతా మౌంట్‌బాటన్‌కీ జై అని జయజయ ధ్వానాలు చేశారు. దేశనాయకులను స్తుతించే నినాదాలతో వేలకొలది దేశ ప్రజల కంఠాలు మారుమ్రోగాయి.

అయితే, ఒక్కమనిషి ఈ ఉత్సాహంలో పాల్గొనలేదు. అతడు ఎవరోకాదు; స్వాతంత్ర్య సంపాదనకు సూత్రధారుడైన గాంధీజీయే. ఆయన తనకు ఢిల్లీ రమ్మని వచ్చిన ఆహ్వానాన్ని తిరస్కరించాడు. దేశానికి ఒక సందేశంకూడా ఇవ్వలేదు. ఈ ఉత్సవాల హడావిడిలో ఆయన మాత్రం దుఃఖంతో ముడుచుకు

పోయాడు. ఆయన ఈసంబరాలధ్వనీ హడావిడీ వినపడకుండా చెవులు మూసుకొన్నాడు.



ఆయన కిప్పుడు కనబడుతూ ఉన్నది తా నిన్నాళ్లు కలగన్న స్వతంత్ర, అఖండభారతం కాదు; రెండు ముక్కలయిపోయిన ఇండియా. హిందూ మహమ్మదీయుల నడుమ ప్రేమ పెంపొందింప జెయ్యడానికి ఎంతోపాటుపడ్డాడు; కాని విడిపోయిన చెక్కలలో ఒకటి పాకిస్తానుగా, ముస్లింజాతి దేశంగా రూపొందింది.

తాను 32 ఏళ్లు పడిన శ్రమంతా వృథాఅయిపోయిందని గాంధీజీ విచారించాడు. ఆయన ఆరోజంతా ఉపవాసమూ, ప్రార్థనలతోను, నూలువడకడంతోను గడిపివేశాడు. "నువ్వు మానవత్వంపైని విశ్వాసం కోలుపోవద్దు. మానవజాతి మహాసముద్రం: మహాసముద్రంలో కొన్ని చుక్కలు మలినమైనా, సముద్రం అంతా మలినమైపోదు" అని గాంధీజీ ఒక మిత్రునికి వ్రాశాడు.



"ఓ ప్రభూ, మమ్ము చీకటినుంచి వెలుగులోనికి నడిపించు" అని గొంతెత్తి ప్రార్థించాడు.

స్వరాజ్యం వచ్చాక, పంజాబులో దౌర్జన్యాలు చెలరేగాయి. కాని గాంధీజీ కలకత్తాలో ఉండడంచేత తాత్కాలికంగా అయినా బెంగాలులో తీవ్రమైన అల్లరులు జరగకుండా ఆపాడు.

సెప్టెంబరునాటికి హింసాచర్యలు మళ్లీ తలెత్తాయి. అటువంటి సందర్భాలలో ఆయన ఆచరణలో పెట్టే మామూలుచికిత్స - ఒకటే - హింసాచర్యలు ఆపక పోతే తన ప్రాణం పోయేవరకు ఉపవాసం చెయ్యడమే. వెనువెంటనే మార్పు కనబడింది. అల్లరులకు పూనుకొన్నవారు తమంతట తాము లాఠీలు, కత్తులు, ఇతర ఆయుధాలు - అన్నిటినీ విడిచిపెట్టారు. "అక్కడి ప్రజలు శాంతి వాతావరణంలో సుఖంగా బతకడానికిగాను ఆయన తన ప్రాణాలను బలి ఇయ్య



దానికి సిద్ధపడ్డాడు" అని ఒక కలకత్తా వార్తాపత్రిక ప్రకటించింది.

కలకత్తాకు వచ్చిన పని పూర్తిచేసుకొని, సెప్టెంబరు చివరలో గాంధీజీ ఢిల్లీ చేరుకొని అక్కడ బిర్లా భవనంలో మకాం పెట్టాడు. అక్కడ 1947 అక్టోబరు 2-వ తేదీని ఆయన 78-వ జన్మదినంనాడు మౌంట్‌బాటన్ ప్రభువూ, ఆయనసతీమణీ గాంధీజీకి తమశుభాకాంక్షలు స్వయంగా వెళ్లి అందజేశారు. గాంధీజీ-హిందూ సంప్రదాయం ప్రకారం పూర్తి మానవజీవిత ప్రమాణము 125 సంవత్సరాలు తాను జీవిస్తానని - కొంతవరకు పరియాచకంగాను, కొంతవరకు నమ్మకంగాను చెపుతూ ఉండేవాడు. ఇప్పుడాయన అంతవరకు జీవించడం తనకు ఇష్టంలేదని అంటూ వచ్చాడు. తాను ఇన్నాళ్లు కన్న కలలు, వాటితో కూడగట్టుకొన్న ప్రపంచం కూలిపోయిన ట్లనిపించిం దాయనకు.

"పశ్చిమ పంజాబునుంచి 57 మైళ్లపొడవున హిందువులతో, సిక్కులతో కూడిన పెద్ద శరణార్థులగుంపు భారతదేశానికి తరలి వస్తోందని విన్నాను. ఇది తలచుకొంటే నా తల తిరిగిపోతోంది. ఇలాంటి దుర్ఘటన ప్రపంచంలో ఎక్కడా ఎప్పుడూ జరగలేదు. ఇది నన్నూ, విధిగా మిమ్మూ సిగ్గుతో తలవంచుకొనేటట్లు చేస్తుంది."



ఆ విధంగా గాంధీజీ అన్న మాటలు అతిశయోక్తి కాదు. ఆ 57 మైళ్ల పొడవునా ప్రయాణిం చిన శరణార్థుల గుంపువంటివి ఎన్నో జనసమూహాలు దాదాపు ఒకకోటి, యాభైలక్షల ప్రజ తమ ఆస్తిపాస్తుల నన్నిటిని వదులుకొని, ఎన్నో వందలమైళ్లు నడిచి భారతదేశం చేరారు. వారంతా ఇప్పుడు ఇల్లూ, వాకిలి, దిక్కూ మొక్కూ లేనివారు అయారు. పాకిస్తానులో కలిసి పోయిన పంజాబు ప్రాంతంనుంచి లక్షలకొద్దీ హిందువులు, సిక్కులు వచ్చేశారు. అలాగే లక్షలకొద్దీ ముస్లిములు కాలినడకని పాకిస్తానుకు తరలివెళ్లారు. ఒక్కొక్కసారి ఇటునుంచి అటు వెళ్లేవారూ అటునుంచి ఇటు వచ్చేవారూ త్రోవలో ఎదురయి ఒకరినొకరు క్రూరంగా హింసించుకొనేవారు. అలా వెడుతూవెడుతూ, కలహాలతో అలసిపోయి, ఆకలికి లోనయి, జబ్బులుచేసి, ముందుకు సాగలేక పూర్తిగా గమ్యస్థానంచేరేలోపునే చనిపోయారు చాలామంది. మూఢాభిమానమూ, జాతివిద్వేషమూ మనుష్యలకు పిచ్చిఎత్తేలాగ చేశాయి. అయినప్పటికీ గాంధీజీకి మానవత్వంమీదా, దేవునియెడలా విశ్వాసం తగ్గలేదు.



ఆయన ఆశించినవన్నీ తలకిందులై, గుండెబద్దలైపోయేటంతటి పూర్తి నిరాశతో కూడిన చీకటిరోజు లవి. ఇదంతా ఆయన ఎలా సహించాడో! "ప్రార్థన నా ప్రాణాలను నిలబెట్టింది. అదే లేకపోతే ఏనాడో పిచ్చివాడిని అయిపోయి ఉండేవాడిని. బహిరంగజీవితంలోను, వ్యక్తిగతంగాను నాపాలిటికి చెప్పుకోతగ్గ చేదుఅనుభవాలన్నీ నేను రుచిచూశాను. వాటివల్ల తాత్కాలికంగా

నిరాశలో పడేవాడిని. ఆ నిరాశ నేను వదిలించుకోగలిగానంటే అది నా ప్రార్థన ద్వారానే సాధ్యమయింది. సత్యంలాగే ప్రార్థన కూడా నా బ్రతుకులో ఒక భాగం అయిపోయింది. నాచుట్టూ ఇంతటి విషాదమూ, నిరాశా అలముకొని ఉన్న ఈ రోజులలో నా హృదయంలో పరమాత్మ ఉన్నట్టే నాకు తోచి ఉండకపోతే, నేను ప్రచండ ఉన్మాదిని అయిపోయి హూగ్లీనదిలోకి దుమికివేసి ఉండేవాడిని–" అని గాంధీజీయే అన్నాడు.





హిందూ ముస్లిములమధ్య కక్షలవల్ల అప్పటికి ఢిల్లీ చెరుగొన్న గాంధీజీ మనస్సు పాడయి నిరాశతో నిండిపోయింది. ''నిస్సహాయస్థితిలో ఏపనీ తోచకుండా ఉండే పరిస్థితినిమాత్రం నా జీవితం అంతటా ఎన్నడూ నేను సహించలేదు—'' అన్నాడాయన.

ఎవరితోను సంప్రతించకుండా ఆయన ప్రాణంపోయేవరకు ఉపవాసం చెయ్యడానికి నిశ్చయించాడు. ఇండియన్ యూనియన్‌లోని హిందూ ముస్లిముల యొక్కా, పాకిస్తాన్‌లోని ముస్లిములయొక్కా అంతరాత్మలను హెచ్చరిస్తూ ఈ ఉపవాసం చేస్తున్నానని ఆయన ప్రకటించాడు. దానితో ప్రతివ్యక్తీ గాంధీజీకి ఏమౌతుందో అని భయపడి, రెండు జాతులమధ్యా సామరస్యమూ, శాంతి నెలకొల్పడానికీ పాటుపడి గాంధీజీ ప్రాణాలు నిలబెట్టడానికి సర్వవిధాలా ప్రయత్నించారు.

పాకిస్తానునుంచి ఇండియాకు బాకీఉన్న ఒక పద్దులోని మొత్తాన్ని రాబట్టుకొనేటందుకుగాను ఇండియాప్రభుత్వం తాను పాకిస్తానుకు మరొక పద్దులో ఇయ్యవలసిన 55 కోట్ల రూపాయలను జమకట్టడం ఆలస్యం చేశారు. గాంధీజీ కోరికపైని ఇప్పుడు ఆ మొత్తం వెనువెంటనే జమ కట్టివేశారు.



ఆయన ఉపవాసం కొనసాగిస్తూ మాటాడితే మాట వినపడనంతటి నీరసంగా అయిపోయాడు. చిట్టచివరికి, అన్ని పక్షాల ప్రతినిధులూ సమావేశమై, శాంతిసామరస్యాలను రక్షిస్తామని ప్రమాణాలుచేసి నచ్చజెప్పాక గాంధీజీకి సంతృప్తి కలిగింది.

ప్రార్థనలు చేశారు; ఆయనకుఇష్టమైన భక్తిగీతాలుపాడారు; ఆతరువాత గాంధీజీ తన ఉపవాసం విరమించాడు.

వరుసతప్పకుండా రోజూ గాంధీజీ ప్రార్థనసభలుచేస్తూండేవాడు. ఆయన ఉపవాసం అయిన వెంటనే జరిపిన సభలకి ఆయన్ని బసచేసిన బిర్లా భవనంనుంచి ఆవరణలోని మైదానంలోకి ఒక కుర్చీలో మోసి తీసుకొని వెళ్లేవారు. రెండవరోజు సభ ఆవరణలో ఒక పెద్ద ప్రేలుడు వినబడింది. అది ఎవరో గాంధీజీపైని పడాలని విసిరిన బాంబు-దూరంగా మరో మూల ప్రేలిపోయి, తోట ప్రహరీగోడలో కొంతభాగం కూలిపోయింది. గాంధీజీ ఎంతమాత్రమూ చెక్కుచెదరలేదు. ''దాన్ని గురించి పట్టించుకోకండి. నా మాటలు వినండి'' అని సభలోనివారికి చెప్పాడాయన. ముస్లిములను రక్షించాలని ఆయన చేసిన ఉపవాసం కొందరికి ఆగ్రహం తెప్పించింది. ఆయనమాత్రం ప్రార్థన సభ ఆవరణలోకి వచ్చిన ఎవ్వరినీ కూడా సోదా చెయ్యడానికి వీలులేదని గట్టిగా చెప్పాడు.





1948 జనవరి 30 వ తేదీ శుక్రవారం, చలిగా, ఆకాశం నిర్మలంగాఉన్న రోజు. ఆ రోజు ప్రొద్దుటే ఆయన తన గుమాస్తాతో "నాకువచ్చిన ముఖ్యమైన ఉత్తరాలన్నీ తీసుకొని రా. వాటికి ఈవేళ నేను జవాబులు వ్రాసి తీరాలి. రేపటికి ఉంటానో లేదో" అన్నాడు.

సాయంత్రం 5 గంటలు దాటి 10 నిమిషాలయాక, గాంధీజీ ప్రార్థన మైదానానికి బైలుదేరాడు. తన మనమరాళ్లు అభా, మనూల భుజాలపై చేతులు ఆనుకొన్నాడు. మైదానానికిఎక్కవలసిన ఐదు చిన్న మెట్లు గబగబా ఎక్కివేసి, సభావేదికవైపు ఆత్రంగా వెడుతున్నాడు.

ఆయనకు వందనం చెయ్యడానికి జనం లేచారు. చాలామంది ఆయన్ని రాచుకునేలాగ నిలబడ్డారు; కొందరు ఆయనకు దారి ఇచ్చారు. హఠాత్తుగా కాకీ 'యూనిఫాం' దుస్తులు వేసుకొన్న ఒకమనిషి గుంపులోనుంచి ముందుకు తోసుకునివచ్చాడు. అప్పటికే ఆలస్యంకావడంచేత మను అతన్ని ఆపబోయింది. కాని, అతని తోపుడుకు ఆమె పడిపోయింది. అతడు మహాత్మునికి ఎదురుగా

రెండడుగులదూరాన ఆగి, కొద్దిగా నమస్కరించినట్లు వంగి, పిస్తోలు పైకితీసి, మూడుసార్లు వరుసగా ఆయనపైని పేల్చాడు. ఒకగుండు గాంధీజీ కడుపులో నుంచి వీపుగుండా వెనక్కి దూసుకొనిపోయింది. ఇంకొకటి ఆయన రొమ్ములోకి పోయి ఊపిరితిత్తిలో చిక్కుకొన్నది.

మొదటి ప్రేలుడుకు గాంధీజీ ఎత్తినపాదం కిందకి వాలింది; ఆయన నిలబడే ఉన్నాడు. రెండో ప్రేలుడుకు ఆయన ముఖం రంగు బూడిదవర్ణంగా మారింది; ఆయన తెల్లని దుస్తులపైని రక్తం చిందింది. చేతులు మెల్లిగా పక్కలకు జారుకొన్నాయి. మెత్తని స్వరంలో ఆయన 'హే రాం' అన్నాడు. మూడవ గుండు ప్రేలేసరికి ఆయన శరీరం కూలిపోయి ఆయన వెనక్కు పడిపోయాడు. ఆయన కళ్లజోడు నేలమీద పడిపోయింది. చెప్పులజోడు పాదాలనుంచి ఊడిపోయింది.

అభా, మనూ గాంధీజీ తలను పైకి ఎత్తారు. ఆయన్ని బిర్లాభవనంలోని ఆయన గదిలోకి తీసుకొని వెళ్లారు.

పదినిమిషాల తరువాత, ఆయన చనిపోయాడని వైద్యుడు ప్రకటించాడు.





జవాహర్‌లాల్‌నెహ్రూ తన కార్యాలయంనుంచి గాంధీజీ పక్కకు వేగంగా వచ్చి చేరుకొన్నాడు. ఆయన పక్కని మోకాళ్లపై కూర్చుండి, గాంధీజీ రక్తంతో తడిసిన దుస్తులతో తనముఖాన్ని కప్పుకొని, ఒళ్లంతా వణకుతూ, వెక్కి వెక్కి విలపించాడు.

ఈ విషాదవార్తను దేశప్రజకి ప్రకటించవలసిన బాధ్యత ఆయనదే. బిర్లాభవనపు సింహద్వారం చేరుకొని, అక్కడ వేచిఉన్న ప్రజాసమూహానికి ఆయన ఈ దుర్వార్త ప్రకటించాడు.

ఆ తరువాత ఆ నాటి సాయంత్రం ప్రధానమంత్రి దేశప్రజలకు ప్రసారం చేసిన సందేశంలో "మన జీవితాలనుంచి వెలుగు వెళ్లిపోయింది. అన్నిచోట్లా చీకటి ఆవరించుకొన్నది. మీకు ఏం చెప్పాలో ఎలా చెప్పాలో తోచటంలేదు. మన ప్రియతమనాయకుడు, మనం బాపూ అని పిలుచుకొనే మన జాతిపిత మనకికలేదు...." అని చెప్పాడు.

గాంధీజీ భౌతికశరీరాన్ని ఆ మరునాడు దహనంచేశారు. ఐదు మైళ్ల పొడవునా, పెద్ద ఊరేగింపుతో అయన శరీరాన్ని ఢిల్లీలోని యమునాఘట్టానికి తీసుకొని వెళ్లారు. ఆయన శరీరాన్ని సైనిక ఆయుధశకటంపైని ఉంచి, పువ్వులతో అలంకరించి, శకటంచుట్టూ జాతీయపతాకంతో కప్పి, ముందూ వెనుకా ఆరువేల మంది పదాతిసైనికులూ, నౌకాసైనికులూ, వాయుసైనికులూ, రక్షకభటులూ కవాతుచేస్తుండగా రాజలాంఛనాలతో సాగింది ఊరేగింపు. ఆ ఊరేగింపులో పాల్గొన్న జనం 15 లక్షలమంది; ఇంకొక పదిలక్షలమంది దారిపొడుగునా రెండుపక్కలా నిలబడి ఊరేగింపును దర్శించారు.

కొత్త స్వతంత్రరాజ్యపు బరువు బాధ్యతలు భుజాలపైని పడిన నెహ్రూ ఒంటరివాడైపోయినంత వియోగబాధ పొందాడు. ఇప్పుడతనికి పక్కన నిలచి, సలహాలు ఉపదేశాలూచేసే జాతిపితసాహాయ్యం ఇక దొరకదు. రామదాసుగాంధి తండ్రి చితిపై నిప్పు వెలిగించాడు. అది గొప్ప విషాదకరమైన దృశ్యం. ప్రతివ్యక్తీ విలపించిన సమయం అది. వెక్కి వెక్కి ఏడ్పులూ, రోదనలూ పొంగి పొరలి మూగిఉన్న జనసమూహం అంతటా వినిపించాయి. గాంధీజీ శరీరాన్ని పైకి ఎగజిమ్మే అగ్నికీలలకు ఆహుతి అయిపోయి బూడిద అయిపోయింది.



అన్ని యుగాలకు చెందిన అవతార పురుషు లనదగిన నాయకులలో ఎన్న తగినవాడు గాంధీజీ. వేదాంతి, తపశ్శాలి, గురువు, ప్రబోధకుడు, రచయిత, వక్త, వినయవంతుడైన మానవోత్తముడు, కర్మ యోగి, ప్రజలందరికి మిత్రుడు, తండ్రి! ప్రపంచసామ్రాజ్యాలన్నింటిలోను బల వత్తమమైనదానిని పునాదులు కదిలేటట్లు చేశాడు; రాజప్రతినిధులతో అధికార గర్వంగల పరిపాలకులతో కలిసి మెలిసి తిరిగినా, నిరాడంబరంగా, వినయంగా, పేదమనిషిలాగ అంటరానివారితో కలిసి జీవించాడు. తనదేశంలో అతి నాజూకైన మజ్లిను దుస్తులకు పేరుపొందినా మకు టంలేని రాజయిన మహాత్ముడు మాత్రం నూలుతో చేతితో వడికిన ముతక ఖద్దరు పంచెలే కట్టాడు. తనను అనుసరించిన లక్షలాదిజనానికి జీవితానికి నిజమైన అర్థ మిదీ అని చెప్పి వారికోసం ప్రాణాలను వదలడానికైనా సిద్ధంగా ఉండేవాడు. మనిషి బక్కగాఉన్నా రాక్షసబలమూ, ఓర్పూ ఆయనకుండేవి. అసలు ఆయన ఎటువంటిమనిషి? గౌతమబుద్ధునికి తరు వాత ఉత్తమోత్తముడైన భారతీయుడు మహాత్మగాంధీయే అన్నారు. నిజానికి అంతకంటే ఘనుడుకాడా? ఈ ప్రశ్నకు జవాబును చరిత్రయే ఇస్తుంది.



Printed at Modern Printers, K-30 Naveen Shahdara, Delhi-110 032